# మొక్కుబడి

'మంజీర'

వేణుపతి నాయుడుగారిని గురించి, అందరు అనేక విధాల చెప్పుకుంటారు. ఈ పెద్దమనిషి గురించి చెప్పేటప్పుడు, నా పాఠకుస్నే హీగుడొకడు తన మొఖం చాటంగ చేసుకొని, ఆయన చాలా మంచివాడనినీ, ఆయనకు ఆయనే సాటి అనినీ, అలాంటి ఘనుణ్ణి మరొకణ్ణి తన జీవితంలో చూడలేదనీ, చూడబోడనీ, కొంచెం కడబోసినట్లు చెప్తారు. ఇంత పాత స్నేహితుడు అంత గొప్పగా చెప్తూంటే కాబోసు అనుకున్నాను. కాదనడానికి దమ్ములేవు సరి కదా. వాడు నా చెవి నులిమిపుచ్చుకొని బోధించదగిన అర్హతగల స్నేహితుడు మాటలుగా బీదవాళ్ళ చెప్పడం మానేసే "ఇంత దుర్మార్గుడా!" అనిపిస్తుంది. కొత్తింమీద ఆయన మంచివాడు, మంచివాడని, పెద్దమనుష్యులు చెప్పినా, ఆయన్నే మరోరకం మనుష్యులు ఎంతో చెడవాడంటూ వాపోవటం వింటూంటే యీ మంచి చెడ్డల కేమయినా అర్థముందా అనిపించేది. ఈ పైవిషయాన్నే ప్రాతిపదికగా తీసుకొని యోచిస్తే, ఒక నిర్దిష్టమయిన పరిస్థితులలో ఉన్న ఒకవ్యక్తి దృష్టిలో ఏదయితే మంచిదో, అదే మరోపరిస్థితులలో ఉన్న ఇంకోడి దృష్టిలో చెడ్డగా కనిపిస్తుంది. నామట్టుకు నేను యీ వస్తువు చెడ్డది, యీపని మంచిది అని స్థిరపరచలేను. అందుచేతనే కాబోలు నాయుడుగారిని గూర్చి నేను ఏ అభిప్రాయానికీ రాలేకపోయాను. ఆయన మంచిచెడ్డలు గ్రహించాలంటే, ఆయన సంగతి సందర్భాలు గ్రహించాలి.

వెంట్రుకలన్నీ తెల్లగా నెరిసిపోయి, కళ్ళకు సులోచనా లలంకరించినా, మనిషి పిడుగులాగుంటాడనడానికి సందేహం లేదు. మాటలాడుతూంటే పిట్టలు నీళ్ళు త్రాగవు! చాలాకాలంగా గుమాస్తాపని చేస్తున్నాడు. ఎప్పుడూ ఒకటే వేషం. ఆ జారిపొయ్యే పంచకట్టు, చొక్కా కన్నా చిన్నకోటూ అయినా, నడుస్తూంటే జాలేస్తుంది. ఆయన ఎన్నాళ్ళ బట్టి గుమాస్తాపని జేస్తున్నాడో ఆయనకే తెలీదేమోకూడా నిజానికి!

మొన్న ఈమధ్య ఒకాయన వచ్చాడు. ఆ మహానుభావుడు సైకిలుమీద హిందూదేశం అంతా తిరిగేస్తాడు! అలా మన హిందూదేశాన్ని ఉద్ధరించేటాక, ప్రపంచమంతా చుట్టేసి వస్తాడుట! సోమరిపోతుడిలాగ! రోజూ సరాసరి 15 మైళ్ళు సైకిలు త్రొక్కుతాడట! అదీ ఆయన ఘనత! ఆ మహనీయుడు వస్తే ఆ రోజున సందర్శించడానికి వచ్చిన జనం ఆ వూళ్ళో కేవుకే పెట్టేస్తారు. రోజుకు 15 మైళ్ళు సైకిలు త్రొక్కడమనే దేదో మానవాతీత కార్యంలాగ ఎంచేసి ఆ సైకిలు గాడికి హారాలతో స్వాగతగీతాలు పాడి రెండుపూటలా మేపి, కొంత దక్షిణ కూడా ఇచ్చి పంపారు. వెర్రిపీడలు. ఆ లెక్కనిచూస్తే నాయుడు గారు రోజూకు చులాగా 15 మైళ్ళు దూరం నడుస్తారు. అంటే తిన్నగా రోడ్డుమీదగాకపోయినా ఇంటినుండి ఆఫీసుకు. ఆఫీసులో అధికారులకు అరడజనుట్లు. ఆ పైన ఇంటి వ్యవహారాలు కొల్లలు! ఈ తిరగవ దూరం తక్కువ ఉంటుందా ఏమిటి? ఎవడూ లెక్కచేసి చూచుకోడుగాని ఇంత తిరుగుడు తిరుగుతూ, ఆఫీసులో తల్లబద్దలయ్యేలాగ చాకిరీచేస్తూ ఇప్పటికి పాతిక సంవత్సరాలు గడిపాడే! ఈయన పోతూంటే, హారాకారాలు లేవు సరికదా, ప్రక్కన తిట్టకుండాను, వెక్కిరించకుండాను ఉంటే అంతేచాలు! అదీ లేదు. ప్రపంచ ధోరణి ఇంతేనేమో! ఇన్నేళ్ళనుండి పని చేస్తున్నా ఆయన ఉద్యోగంలో యేమీ ఎదుగూ బొదుగూ లేదు. కానీ ఆయన సంసారంమాత్రం అపారంగా పెరిగిపోతూంది. ఏడాదికో నోరు అన్నం కోసం తెరుచుకుంటూంది. నాయుడుగారి ఉద్యోగం మామూలే. ఆడపిల్లలు ఎదిగి పెద్దవాళ్ళయ్యారు; ఆ పైన కొడుకుల్లంతా ఏదో తమాషాగా విసురుతున్నారు కటువుమాటలు. ఆ విసరటంలో ఉన్న అందం ఏమిటంటే, సరిగా నాయుడుగారి చెవిలోనే దూరుతున్నాయవి! నాయుడుగారు ప్రపంచంతో చేయీ చేయీ కలిపిపోయే మనిషి. ప్రపంచానికి అడ్డుతిరగడు. ఎవరెయినా ఆడోస్తే సహించలేడు. అందరూ అంతే ఎవరో కొందరు తప్ప. ఇక ఊరకుంటే తనకున్న పరువూ ప్రతిష్ఠ కాస్తా కొట్టుకుపోతాయేమో అనిందా ప్రవాహంలో అని ఆయన భయం. వెతికి వెతికి చాలా తెలివైనవాళ్ళి, గొప్పవాళ్ళి, తన పిల్లలకు తగినవాళ్ళ్ని, అనుకుంటున్న యువక చక్రవర్తులను ఎంచిఎంచి, తన కున్న స్థిరచరాస్తుల తెగనమ్మగా వచ్చిన ధనంతో కొని పారేశాడు! ఆ యువక రత్నాలకూడా తమకు తగిన విలువ దొరికిందిగదా అన్న ఆశతో ఉబ్బితబ్బిబ్బై ఆ

లంచావతారులను చేపట్టారు. ఆ దెబ్బతో నాయుడుగారింట్లో సిరీ, సంపదకూడా ఖాళీ అయినాయి. అయినా నాయుడుగారి ఆనందానికి మేర లేదు. తను ప్రపంచాన్ని సంస్కరించాడు. ఇంట్లో దమ్మిడీ లేదు. కరువు రోజురోజుకూ పెరుగుతోంది. అమెరికా ఐశ్వర్యంలాగ, ధరలు పదిరెట్లు అయాయి. కాని నాయుడుగారి జీవితం మామూలే. కష్టం మామూలే. ఆ అని అనడానికి వీలే దసలికి. కాని తనకళ్ళముందు, ఉద్యోగంలో చేరినవాళ్ళు, తనవద్ద పని నేర్చుకున్న వాళ్ళు పెద్ద పెద్ద ఉద్యోగస్థులయి పోతున్నారు. వాళ్ళలో ఉన్న విశేషం, తనలో లేని శక్తి ఏమిటి చెప్మా అనుకున్నాడు నాయుడుగారు.

ఈ విషయంగురించి పరిశోధనలు చేయటం మొదలుపెట్టారు. దాని అంతూ కనిపెట్టారు. అన్నిటికీ మూలం ఏమిటో గ్రహించాడు. తన ఈ ఆఖరి దశలోనయినా నాలుగురాళ్ళు సంపాయించకపోతే తన పిల్లలగతి యేంకాను! తన వృద్ధాప్యంలో, యింత గింజాకు చే లోకం, ఒక కొని యిస్తుందా తను చేతులు జోడించి దీనంగా ప్రార్థిస్తుంటే? అయినా ప్రపంచానికి అనుగుణంగానే నడుచుకోవాలి మరి. ఈ విషమయిన ఆలోచనలు ఆయన మెదడులో ప్రవేశించి వృద్ధిపొందిన కొద్దీ, ఇంట్లో ఆర్థిక ప్రతిష్టంభన రెట్టింపు అయింది. జీవితం సుఖంగా, హాయిగా, సాగాలంటే ఎలాగో అలాగ డబ్బు గడించి తీరాలి అనే ఉద్దేశ్యంలోకి వచ్చేశారు నాయుడుగారు. అది మానవ ప్రవృత్తిలోని విచిత్రం. ఒకసారి తనకు కావలసిన విషయం మనస్సులో స్థిరపడిందా, దాన్ని లాగో ఒకలాగ, హిమాలయ ప్రమాణమయిన ఆటంకాలొచ్చినా సాధిస్తుంది. ఆ మనోగమన ప్రవృత్తే కావాలి! రావాలి! దాన్నే నాయుడుగారు సాధించగల్గారు. అలా ఊరికే అనుకున్నంత మాత్రంలోనే ఆ సాఫల్యం రాదు. చుట్టూ ఆవరించిన పరిస్థితులు కూడా సమకూరాలి.

మగపిల్లల చదువు, యింట్లో తిండి, యింటద్దె, అందరికీ బట్టలు, మనస్సుకు వినోదం, ప్రశాంత వాతావరణం అన్నిటిలోనూ ఈ జీవితంలో! అన్నీ చిక్కులే?

నాయుడుగారి జీవితం యీ చిక్కులమయం అయింది. ఆయన సంసారంలో ఉన్న వ్యక్తుల జీవితాలన్నీ మెలిపెట్టుకుపోయి, చిక్కుపడిన దారపుండలా తయారయాయి. ఒక్క ముడిలో యిమిడింది చిక్కంతా. అదే డబ్బు! అది సంపాదించి తీరుతాననుకున్నాడు, తనలో తను. ఇదివరలోనే యీ అభిప్రాయాన్ని తనకు కలగజేయనందుకు ఆ భగవంతుణ్ణి పూర్తిగా చివాట్లు పెట్టారు. భగవంతుడే కావాలని కలగక పోయినా, తానంతట తనకు కలిగినందుకు, లోలోన తన్నుతను అభినందించుకొని, అప్పుడప్పుడు రొమ్ము విరిచి తన లోలోపలి అంతరాత్మ గొంతునులిమి చంపి పారేశాడు నాయుడుగారు!

డబ్బు రాబట్టడం ఆరంభించాడు. డబ్బుకూడా అలాగే రావడం మొదలెట్టింది. డబ్బు వచ్చిన కొద్దీ నాయుడుగారికి ధనతృష్ణ అధికమించింది. ఏ పనయినా ప్రతిఫలం ముట్టకుండా ఎందుకు చెయ్యాలి అనే ఉద్దేశంలోకి వచ్చేశాడు. పెద్దయినా, చిన్నయినా, ఎవరయినా, ఏ పనయినా, తన విధయినా, ఏ మయినా సరే, డబ్బు లేందే నాయుడుగారి వద్ద పనిజరగడం కల్ల అనే ఖ్యాతి గడించాడు ముండావాడు!

కష్టజీవులకది కష్టంగా ఉన్నా, దొంగ వ్యాపారులు, దోపిడీ వర్తకులు, మొదలైన పరాన్నజీవులకుమాత్రం కన్నతండ్రిలా కనుపించే వాడు! నాయుడుగారికి కావలసింది అదే. అది నిర్విఘ్నంగా సాగిపోతూంది. నాయుడుగారికి ఎక్కడ జూచినా తనలాంటివాళ్ళ సంఖ్య హెచ్చుగా కనిపించేది. ఈ డబ్బున్న ఘరానా మనుష్యుల జీవితాలు తరచిచూస్తే, తనకు జేసేది ఏమీ కాదు అని సమ్మతించుకునేవాడాయన!

అదంతా రొక్కంకొని, తనలాంటి విధయాలు బయటపెట్టకూడదు. ఆ వేళ ఆపలబజారు కోమటిని గురించి, తనపూజమూని. తన నీతే, అంతపని చేయించాడు గదా. తను కక్కుర్తిపడి తప్పించుకో లేదేను. తను యిన్నాళ్ళు కాని పుణ్యపోకుండా పని జేసే సానుభూతి జూపిన అపాయి ఎవరూ లేదు. ఈ రోజున నాలుగు రాళ్ళు సంపాయించి, ఘరానాగా తిరగానే అంతా గౌరవమే!

ఎవరయినా నాయుడుగారిదగ్గర నీతి నియమాల గురించి ఇప్పుడు మాట్లాడితే పెదవులు విరిచి చల్లగా సమాధానం చెప్పేవాడు. "చూడండీ, నీతి, నియమం ఉండటం మంచిదే. మనజీవితంలో అటువంటి పవిత్ర ధర్మాలు లేక ఉండవలసిన అవశ్యకత ఎంతయినా ఉంది. ఎలాంటి నియమాలయినా ఎల్లలుండటం అవసరం. మన ప్రపంచమంతా పుచ్చిపోయింది. పాడయిపోయింది. నీతి నియమాలు పాటించేవాళ్ళు చాలా అరుదయిపోయారు. అలాంటి సమయంలో ఒకడూ, యిద్దరూ మడికట్టుక్కూర్చుని, నీతి నియమాల్ని, ఉద్ధరిస్తామంటే లాభం లేదు. సరిగదా ఆమాయలోపడి మునిగి చక్కాపోతరు. అంచేత బుద్ధిమంతుడయినవాడెప్పుడూ, ఒకచేత్తో ఆ మాయను ఆసరాగా తీసుకుని, రెండోచేత్తో దాన్ని చెండాడాలి. అంతేగాని మాయమాయ అని అఘోరిస్తే లాభం ఏమిటి?" అంటాడు ధీమాగా.

ఏది ఎలాగున్నా యిప్పుడుమాత్రం నాయుడు గారికి కొంచెం గౌరవం మర్యాద కలిగాయి. వూళ్లో పెద్దలూ, మోతుబరులూ, నమస్కారాలు చేస్తున్నారు. నాయుడుగారు చాలా సంతోషంగా, ఆనందంగా కాలం గడుపుతున్నారు. దానధర్మాలు చేస్తున్నారు. పెద్దవాళ్లు చిన్నవాళ్లు ఇప్పుడు దానకర్ణుడు అన్నంతవరకు కూడా పొగిడేస్తున్నారు నాయుడుగారిని.

## 2

సరిగా యీ రోజులలోనే నేను నాయుడు గారి దాతృత్వం, కీర్తి విని, ప్రక్కనున్నా యింతవరకు కనిపెట్టలేక పోయినందుకు విచారించాను. నా కష్టసుఖాలు, బాధలు, ఆయనకు బాగా తెలుసు. ఆయన ఆఫీసులో ఏదో గుమాస్తాపని ఖాళీగావుందని తెలిసి వేయించమని అడిగితే—పొరుగువాణ్ణి నన్నా చూడకుండా నిక్కచ్చిగా అడిగాడే లంచం! ఆఖరుకి ఆఫీసరుని బ్రతిమిలాడినా లాభంలేదనీ, ఈయనవల్లనే అవుతుందనీ బంట్రోతు కూడా స్పష్టంగా చెప్పేశాడు పావులా పుచ్చుకున్న తరువాత. ఆయన కాళ్లావేళ్లాపడి బ్రతిమిలాడి నెలనెలా పదిచొప్పున యిచ్చుకుంటానని ఆ నౌఖరీలో చేరాను.

ఆయనమాత్రం నాదగ్గర డబ్బుపుచ్చుకోడం చేతో, మరెందుచేతో గాని. నాయందమిత వాత్సల్యం ప్రకటించేవాడు. తీరిక సమయాలలో గుమాస్తాయొక్క గురుతర బాధ్యతలు, కష్టసుఖాలు, అనేక సమస్యల గూర్చి సమగ్రంగా ఉపన్యాసాలు దంచేసేవాడు.

ఇంకా సంతోషంగా ఉన్నప్పుడు "చూడరా అబ్బాయీ! నీదగ్గరనో పదిరూపాయలు పుచ్చుకుంటున్నానని బాధపడకు. అది గుమాస్తా ఉద్యోగ ధర్మం. పైపెచ్చు మననియమం. అసలీ గుమాస్తాగాడి కింతతక్కువ జీతమియ్యడం ఎందుచేతో తెలుసా. అంచేతే, అంతే, అలా ఉండకపోతే యీ గుమాస్తాగిరీ వదిలేసి, సంసారం సాగరంలో తోసేసి సన్యాసం పుచ్చుకోడం మేలు. తెలిసిందా. ఈ కిటుకు లన్నీ తెలుసుకుని నీ ఉద్యోగం సక్రమంగా నిర్వర్తించావా అందరికీ మంచివాడివే. నీ ఆఫీసరుకూడా ఆనందిస్తాడు. లేకపోతే చాలావిచారించవలసిన పరిస్థితులో పడి దక్కపోతావు. అనగాహానకేసుకో నాయనా!" అంటాడు.

అప్పటికీ నేను చేతులు తోడించి తాళం వేస్తూండడం మొదలుపెట్టాను. అందుకే గాబోలు నాయుడుగారు నేనంటే పడిచచ్చిపోయేవాడు. నేనంటే ఆయనకు ఎక్కడలేని తెలివితేటలా ఉండి పనేవి. మన బ్రహ్మాండ నాయకులకు సయితం లేని వక్తృత్వపటిమ దక్కచ్చేది. ఆయన యెప్పుడయినా ఆహ్లాదంగా ఉన్నప్పుడు నేకనపడితే చాలు. కూర్చొమని కప్పు కాఫీయిచ్చి మొదలెడతాడు.

"ఇలా చూడరా అబ్బాయీ (చెపుతూనే ఉంటాను లెండి) బ్రిటిషువాళ్ళు మనదేశం దోచుకుందుకు వచ్చారు. వాళ్ళకు బలంవుంది. దేశం దేశాన్నే దోచేరు మన నోళ్ళు నొక్కి. అదే న్యాయం అయింది. వాళ్ళని తరిమేశాం ఏదో బ్రహ్మాండమయిన ఉద్యమాలు నడిపి. ఆ ఉద్యమాలలో చచ్చినవాళ్ళూ, త్యాగంచేసినవాళ్ళూ ఎవరు? నువ్వూ నేనే. అయినా యిప్పుడు నీకూ నాకూ ఏముంది? యిదివరకేముందో అదే నీకూ నాకూ. ఓకానీ ఎక్కువివ్వాలంటే యెక్కడలేని అనేక సమస్యలు, విదేశాంగ వ్యవహారాలు అడ్డంవస్తాయి. కాని యీ పరిశ్రమాధికారులు, భూస్వాములు, గుత్తవర్తకులు పెట్టుబడిదారులూ ఎలా డబ్బు చేసుకుంటున్నారో! ఇళ్ళమీదయిళ్ళు, కారుమీదకారు, నోటుమీద నోటు విలాసాలు, సరదాలు, పెళ్ళిళ్ళు, బిస్తలు అన్నీని. ఇవన్నీ చట్టసమ్మతాలే? న్యాయమైనవే? ధర్మసంబంధాలే? నువ్వూ నేనూ అవడానికి వీల్లేదు. నువ్వు "ఆ" అన్నావంటే చట్టవిరుద్ధం. నువ్వూ, నీ ఉద్యోగం, నీ బ్రతుకు కూలిపోతాయి. బూడిదమసి అవుతాయి. అంచేత నీచాతనయినంతవరకు నువ్వూ నోరుమూసుకుంటూండు. ఇది పరమరహస్యం సుమా! మనయిద్దరి మధ్య అంతరంగిక సంభాషణమాత్రమే. ఎటొచ్చీ వాళ్ళకు నీకూ తేడా ఏమిటంటే చట్టం వాళ్లని రక్షిస్తోంది నన్ను భక్షిస్తోంది అంతే."

"ఈ పరిస్థితు లున్నంతవరకూ నువ్వూ నేనూ మడికట్టుకు కూర్చుంటే నశించిపోతాము. అయినా గాని మనము చేసేది ఒలెక్క పైవాటితో పోలిస్తే. ఈ సొంతవ్యాపారాలు, పరిశ్రమలు, డబ్బుచేసుకోడాలు, ఉన్నంతవరకు, నన్ను నువ్వు, నిన్ను మరోడూ, మరొకణ్ణి యింకోడూ కొల్లగొట్టుకోడం ఎలా పోతుంది. ఏరూపంలోనైనా ఒకణ్ణి మరొకడు పీడించుకు తినడాన్ని ఈ సంఘం సమర్థిస్తూ, చట్టాలు రక్షిస్తూ ఉంటే యీ దగాలుపోవు. మడిగట్టుకు మూర్ఖులా నువ్వూ నేనూ కూర్చోడం చట్టవిరుద్ధం అది నేరమే!" అని ముగించేవాడు ఉపన్యాసం.

ఆయన చిరునవ్వూ అప్పటి ప్రవర్తనా చూసినన్నా తాను మెచ్చుకుంటూ ఉంటాడని తేలికగా అర్థమవుతుంది. నాకు మాత్రం అది వింటూన్నప్పుడు అంతా సమంజసంగానే కన్పించేది.

స్వార్థంకోసం ఒకడిని మరోడు దోపిడిచేసుకోడాన్ని అంతంచేసి, కష్టపడేవాళ్లి శ్రమకు తగిన

ప్రతిఫలం, విశ్రాంతి, వాళ్ళ సౌఖ్యాలకు అవకాశాలూ, సౌకర్యాలయినా అంతకన్న యింకేం కావాలి మరి.

నాయుడుగారి ఉద్బోధ నా మెదడులో పూర్తిగా పట్టిపోయింది. నా ఆస్తికబుద్ధి నన్ను పూర్తిగా క్రుంగదీసింది. నాయుడుగారి పాదచ్ఛాయలలో నేనూ నడవడం ప్రారంభించాను. అనుకోని ఆ దినచర్య నాకు సాధ్యమయింది.

అదే నాయుడుగారికి కరతలామలక మయింది!

పేదవాళ్ళు చెమటోడ్చి సంపాయించినది, ఏడుస్తూ యిచ్చినా, ధనవంతులు తమ మోసం సొమ్ము ఏడవనూ యిచ్చినా, సమాన ఔదార్యంతో పుచ్చుకోవడంలో ఉన్న ఘనత ఆయనకు పూర్తిగా దక్కింది.

ఈనుంచి గుణాలు అలవడిన వెనుక నాయుడుగారు బుజ్జిగుమస్తా అంటే పెదగుమస్తా అయినారు. ఇప్పుడు యీయన ప్రతిభ మహోజ్జ్వలమానంగా వెలుగుతోంది. నాయుడుగారి పేరు చెప్పితే అధికారులు సహా వణుకుతారు.

అయినా చట్ట విరుద్ధంగా ఎంతకాలము మనగలం. నాయుడుగారు లంచం పుచ్చుకుంటూండగా చేరతుకొభల వరిమువారు పట్టుకున్నారుట. "అరెరె" అన్నారందరూ. "ఇంత ధర్మాత్ముడు యీయనకీ గతేమిటి పాపం!" అన్నారు కొందరు. "మంచి పని యిందన్నారు" చిన్న గుమాస్తాలు.

నేను మాత్రం నా జాగ్రత్త నేను పడ్డాను. అందరికతి అలాగే ఉంటుందేమిటి? నావిధి నేను మామూలుగానే నిర్వర్తిస్తున్నా కాస్త మెలకువతో ఉంటున్నాను. నాయుడుగారిని కచ్చేరీనుండి తాత్కాలికంగా తప్పించారు. చాలా ముందు వాడినయినా, నాకన్న పాతుకుపోయిన పాతగుమాస్తాలున్నా నాయుడుగారి ఖాళీలో నన్నే వడేశారు.

గురూపదేశం చాలా బాగా పనిజేసింది మరి!

అధికారులు నన్నే ఎందుకు పెద్ద గుమస్తాగా వేశారో ఎవరికీ అర్థం అవలేదు, నాకూ ఆ అధికారులకూ తప్ప.

ఇరుగుపొరుగు వారంతా నా పూర్వజన్మ సుకృతం అన్నారు. నేను మాత్రం కాదనడమెందుకు? ఆఫీసు వాళ్ళంతా నా అదృష్టమన్నారు. అదీ కాదన లేకపోయాను. అధికార్లు అతి చురుకైన వాడన్నారు. 'మహాప్రభో!' 'మహాప్రసాదం' అన్నాను నేను.

ఈ సుభాషితాలతోపాటు నాయుడుగారి ధర్మంగురించీ తెలివితక్కువగురించీ కూడా వేయినోళ్ళ ప్రశంసించారు. అంతా చాలా సానుభూతి వెల్లడి చేశారు. ఆయన చేసినదంతా న్యాయమేనట! కర్మమాత్రం వక్రంగా తిరిగిందట. కర్మ వక్రించి తిరిగినా అదృష్టం బాగుందట! అందుకే ఆవూళ్ళో ఉన్న మోతుబరిషావుకారు తాను జామీనుండి ఆయన్ని విడుదల చేయించాడుట. నాయుడుగారు మాత్రం ఆ తర్వాత నాకు కనిపించలేదు.

కేసు లావాదేవీలు, పోలీసుల బేరాలు, ప్లీడర్ల సొంత ఫీజుల వ్యవహారాల్లో ఆయన మునిగిపోయారు.

ఆయన యిదివరలో చేసి వదలిన పనిలో నేను నిమగ్నుడనయ్యాను. ఒకరిని గురించి ఇంకొకరు ఆలోచించడానికయినా తీరిక కనుపించడం లేదు. అయినా గాని ఆయన్ని గురించిన వార్తలుమాత్రం పుష్కలంగా వస్తున్నాయి. రోజు రోజుకీ సంపాదించినది కాస్తా కక్కుతున్నాడుట!

ఎంత దారుణ కోపమున్నా యీ ప్రజలు "పాపం" అనే సానుభూతి పదం ఎందుకు ఉపయోగిస్తారో! వాళ్ళ అంతరార్థ్యం లోతు కనుక్కోడం కూడా కష్టమే.

"కోర్టు కెళ్ళినవాడు, కాటికి వెళ్ళినవాడు సమానం!" అని తెలుగుసామెత. దీన్లో ఎంత సత్యం లేకపోతే ఇది చిరంజీవియై ప్రజల నాలుకలపై నిలుస్తుంది!

బ్రిటిషువాళ్ళు మనకు జేసిన మహోపకారాల్లో కల్లా ఉత్కృష్టకర్మ యీ న్యాయస్థానాల ఏర్పాటు! అటువంటి మేలు మన తెలుగువాళ్ళ వల్ల కాదుతో పోల్చారు. అందుకే తెలుగువాళ్ళకు చాలారోజులకి గాని ఆంధ్రరాష్ట్రం యివ్వలేదు!

అసలు 'ఉన్నమాటంటే ఉలుకెక్కువట!' యిదీ తెలుగుసామెతే. ఇలా నిక్కచ్చిగా మాట్లాడ గలిగిన జాతిగనకే అందరికీ కంటకమయింది. 'నిజమాడితే నిష్ఠూరం' అందుచే కష్టాలువస్తాయి.

ఏమయితేనేం తెలుగువాళ్ళమాట మట్టుకి, నాయుడుగారిని కాటికెక్కించింది.

నేనున్న ప్రస్తుత పరిస్థితుల ప్రభావంవల్ల కాబోలు, నాయుడుగారు తిరిగి రాకుండా ఉంటే చాలుననిపిస్తూ వచ్చింది. ఆయన నిజంగా కాటికెక్కినా సంతోషించేవాడినే నేను. దేవుడికి వేలకువేలు నమస్కారాలు పెట్టాను. "ఆయన్ని జైలులోకి పంపునాయనా. అంతకీ ఆయనయందు నీకు ప్రేమా, దయా, పుట్టకపోతే నీ స్వర్గంలో కూర్చోబెట్టుకుని సర్వసుఖాలూ అనుభవింపజెయ్యి. అంతేగాని నామీదకు దండెత్తకుండా చూడు." అని.

శనివారంనాడు ఉపవాసాలుగూడా మొదలు పెట్టాను. అన్నం మెతుకు కలలోకూడా ముట్టనని ప్రమాణం చేసుకున్నాను. మహా తింటే

మినపరొట్టె ఫలహారం మాత్రమే. మధ్య మధ్య ఏకాదశి ఉపవాసాలు, పూజలు యింటిదగ్గర భక్తులందరినీ పోగుచేసి భజనలు కూడా చేయించడం మొదలు పెట్టాను. కనిపించిన దేవుడి గుడికల్లా నమస్కారం పెట్టాను. కనిపించని దేవుణ్ణి భక్తితో కొల్వడం ఆరంభించాను. ఆఖరికి ఆ కేసులో నాయుడు గారికి జీవితాంతం జైలు వేయించేందుకు గాను ఆ భగవంతుడికి నా తలమీద వెంట్రుకలు, గడ్డము మీదుగట్టి మొక్కుకున్నాను.

నాయుడు గారి కేసునుగురించి చాలా ఆతృతతో తెలుసుకుంటున్నాను. ఈ మధ్య ఆయన కేసు గురించి వింటూంటే నాకు చాలా విచారం, కోపం, పొంగుకువచ్చాయి. "ఇంత భక్తితో కొలుస్తున్నా, భగవంతుడికి దయలేదా!" అనుకున్నాను. దేవుడు నమ్మిన వాళ్ళను మోసం చెయ్యడుట. ఏదో వేషం వేసుకునయినా సరే వచ్చి భక్తులని రక్షించి తీరతాడని శ్రుతిస్మృతులు ఘోషిస్తున్నాయి. "అయినా నేడో రేపో తేలుతుంది దేవుడి సంగతి!" అనుకునే వాడిని.

ఒక్కొక్కసారి నాయుడుగారి ప్లీడరుగారి సంగతి వింటూంటే, అసలు దేవుడనేవాడు ఉన్నాడా అనే సందేహానికి కూడా తావొచ్చింది. నాయుడు గారి ప్లీడరు అఖండ ప్రతిభావంతుడట! చాలా గట్టివాడట. ఎదుట వారిని తినేస్తున్నాడుటంతే! అతడు అడ్డు ప్రశ్నలో అఖండుడట. ప్రతికక్షులు ఆయన యక్ష ప్రశ్నలకి జవాబు లీయలేక పరుగు లంకించుకున్నారట! యివీ వార్తలు!

దేవుడి మీద కోపం ముంచుకు వచ్చింది. "అయినా నేడో రేపో తేలుతుంది దేవుడి సంగతి అప్పుడు చెప్తాను. ప్రపంచం అంతా చాటేస్తాను. తర్వాత చూసుకుంటా" ననుకునేవాడిని నేను. అలాగే తేలింది. దేవుడున్నాడా లేడా? అనే ప్రశ్నకు నిలువు జవాబు.

నాయుడు గారికి ఆరునెలల కఠిన కారాగార వాసం విధించారు.

"రక్షించావు దేవుడా!" అని వేయినమస్కారాలు చేశాను. చేసిన పూజలు పెట్టిన నమస్కారాలు ఊరికే పోతాయా!

ఇంక దేవుడి మొక్కు మంచిది చూసి తీర్చాలి. వెంటనే బయలుదేరి వెడదామనుకున్నా. కాని చాలా రాత్రి కావడంవల్ల మానేశాను. మరునాడుదయాన్నే బయలుదేరి పురోహితుడి యింటికి వెళ్ళాను. ఎందుకో అడవిలాంటి నా గడ్డాన్ని వదిలిపెట్టడానికి తయారవడం కష్టంగానే ఉంది.

అయినా యిది భగవంతుడితో వ్యవహారం. ఆయన ముందా మనదాటులు. విచారంతో గడ్డాన్ని, ప్రేమతో హిమాచలంలాంటి నా బుర్ర తీసుకున్నాను. ఆ విచారంలో నా కళ్ళలోనుండి ఒకటి రెండు అశ్రుకణాలు దొరలాయేమో నాకు తెలీకుండా. ఇలా నాలో నేను బాధపడుతూంటే, శాస్త్రుల్లుగారు తమ బాతాఖానీ మొదలుపెట్టారు.

"చూశారా" అన్నాడాయన నన్ను చూడగానే.

"ఆ! ఏమిటీ" అంటూ ఉలిక్కి పడి ముందు వెనకా చూశాను.

"ఏమీ లేదులెండి" అన్నాడు తాపీగా. ఆసమాధానం చూచేసరికి నాకళ్ళు మండింది.

"ఏమీ లేకపోతే ఏం చూడమన్నారయ్యా!" అన్నా విసుగ్గా.

"అబ్బే! ఏమీ లేదు. ఆ ముసలిముండా వాడు చాలా మంచివాడు."

"ఆ ముండావాడెవరో కాస్త సెలవిద్దురూ బాబూ."

"ఆ నాయుడు గారండీ! చాలా సన్మార్గుడు. తమకు యీ ఉద్యోగం ఆయనే వేయించారుటగా! ధర్మాత్ముడు."

"అదే తమబోటి పెద్దలు చెప్పుకుంటున్నారీ ఊరిలో" అన్నా కోపం పట్టలేక.

"మంచివాడికే కష్టాలన్నీను" అని పెదవి విరిచి, బల్లి అరిచినట్లు చప్పుడు చేసి "ఇంకేమిటిలెండి లాభం! ఉద్యోగమూ పోతుంది. శిక్షను అనుభవించాలి" అన్నాడు తన సానుభూతి యావత్తూ మాటలద్వారానే గాకుండా ముఖంద్వారా కూడా ప్రకటిస్తూ.

"అవునంటే మరి!"

"అయినా పెద్ద కోర్టు కెడతాడుటలెండి."

"అయితే యింకా నాశనమవుతాడట!" అన్నా నా ఆనందం కప్పిపుచ్చడానికి ప్రయత్నం చేస్తూనే.

"ఏమో మరి"

"పెద్దకోర్టు కెళ్ళడం అనవసరం. ఏదో ఓచిల్లిగవ్వ యింట మిగిలితే అది ఖర్చు చేసుకోవడం ఒక్కటే జరుగుతుంది."

"నేనూ అదే చెప్తానండి. నాదగ్గరకి వస్తే."

"చాలాసేపయింది వెళ్ళొస్తా" నంటూ ఓ నమస్కారం ఆయన మొహాన్ని కొట్టేసి బయలుదేరాను యింటివైపు.

పాపం శేషెంగారు వచ్చానో ఎంచేత వెళ్ళి పోతున్నానో అర్థం అవక గాబోలు శాస్త్రిలుగారు అలాగే నిలబడిపోయారు నిశ్చేష్టంగా. "ఇదే దేవుడి పరీక్ష" అనుకుంటూ యిల్లు చేరాను, మిగిలిన ఆఫీసు పని ముగించడానికి.

## 3

నాయుడుగారి సంగతేమీ తెలీడంలేదు. ఆఖరుకు ఆయన కుటుంబం కూడా మావూరు వదిలి ఆయన భావమరిది గారింటికి పోయిందట. ఆయనను గూర్చి నేను చాలా వాకబు చేశాను. కనిపించిన ప్రతివ్యక్తిని ప్రశ్నించాను. ఒక్క సెలవుతీసుకుని స్వయంగా వెళ్ళడం తప్పించి మిగతాపని అంతా చేశాను. తెలిసి యేడిస్తేగా. విసుగెత్తి పోతేపోనీ అని ఊరుకున్నాను. ఆఖరుకి పోష్టలు శాఖవారికికూడా ఆయన చిరునామా తెలీదుట! జైలుకుపోయి ఉంటాడనుకున్నాను.

ఈ మధ్య నాకు యీ ఉద్యోగం ఖాయం చేసి వల్లు ఆర్డర్లుకూడా ఇచ్చేశారు. నా అదృష్టానికి ఎంతో సంతోషించాను. ఆఖరుకి సత్యనారాయణ వ్రతం కూడా చేయించాను. ఇక కాస్త నుంచి ముహూర్తం చూసి యీ జుత్తు మొక్కుబడికూడా తీర్చేస్తే బాగుండు ననుకున్నా. మనం అనుకున్నంతా జరిగింది.

ఆ నాయుడు పత్తాలేదు. పాపం జైలుకుపోయి ఉంటాడు!

కాస్త వేగంగా యీ వైభవంకూడా తీర్చేస్తే యిక ముప్పుండదని, ఆ శాస్త్రిలగారిచే తిరుపతిలో మొక్కుబడి తీర్చుకోడానికి ముహూర్తం ఏర్పాటు చేయించాను. ఏదో వేగంగా అవుతుందని నేను ఆలోచిస్తుంటే వాడి సొమ్ముపోయినట్లు శాస్త్రిగారు రోజూ లాలస్యంగా యెంచాడా మంచిరోజు. కొందరు మటాలనీ, పక్కాలని వీళ్ళేగాను సంతోషంతోడ్తీ. పోనీ దేవుణ్ణిమాని పోతారని!

మా బావగారినిచూచి చాలాకాలం అయింది. వెనక ఉద్యోగాలు! ఎంతెంతదూరాలు పోతున్నారు ప్రజలు. అంతదూరం అయినా ఆయన రోజూగయినా కపపడివచ్చి నా మొక్కుబడి మహోత్సవం చూసి పోతానని ఉత్తరంముక్క రాశాడు. ఆయన్ని చూసి కూడా చాలాకాలం అయింది. ఆయన రూపురేఖలే మరచిపోయాను పూర్తిగా.

ఈ శుభవార్త చెప్పడానికి నా భార్యని పిలిచాను. ఆవిడ హంసయానంతో వచ్చేరాడంతోనే యీ వార్త చెప్పాను. ఎంతో ఆప్యాయంగా "మీ అన్నను చాలాచాలా చూడాలనివుంది." అన్నాను.

"బాగా నేనుంది మీరు చూడలేదాయేమిటి నా పెళ్లికి" అంది. కాస్త సిగ్గు అభినయిస్తూ.

"ఎంతకాలమయిందో ఆయన్ను చూచి? పని తొందరల్లో వస్తాడో రాడో!"

"మొన్న మా పుట్టింటికి వెళ్ళినప్పుడు చూశాను నేను. వాడూ యిలాగే ఏదో మొక్కుబడి గడ్డం పెంచి ఆనవాలు పట్టడానికికూడా వీల్లేకుండా మారి పోయాడు. ఎంతపని తొందరలో ఉన్నా నన్నయినా చూడడానికి రాకపోతాడా?"

"అయితే ఆయనకుకూడా ఏదో మొక్కుబడి ఉన్నదన్నమాట మనలాగే! ఎందుకో ఆ మొక్కుబడి?"

"ఏమో ఎవడికి తెలుసు మీ మొక్కుబడులు మీరూను!"

"వెళ్ళు నీపని నువ్వు జాగుకో" అన్నాను ఆమె విసిరిన మాటలకు కాస్త కోపం తెచ్చుకుని. ఆమె విసురుగా లోపలకు వెళ్ళిపోయింది.

మరునాడు ముహూర్తం దగ్గర కొస్తున్నా మా బావగారు గానం కనపడంలేదు. నా కాయన మొక్కుబడి ఎందుకో తెలుసుకోవాలని తహతహ! ఆ గడ్డం కోసం నాగడం ఇంతగా ఓపికపట్టడం నాకే ఆశ్చర్యం వేసింది. గడ్డానికి గడ్డానికిమధ్య ఎంత సామరస్యం వుంది! రోడ్డు వైపుకన్ను చూస్తుండా చూస్తున్నాను. ఆగడంకోసం చాలా దూరం పెరుగుతోంది మనస్సు. ముహూర్తం ఘడియలు సమీపిస్తున్నాయి. అయినా జాడలేదు. "ఇంక లేవండిబాబూ!" అంటూ అరిచాడు పురోహితుడు ఏదో మునిగిపోయినట్లు. గడ్డం కోసం ఎదురుచూస్తున్నా ఘటం లేవక తప్పిందికాదు.

ఇలా లేచానోలేదో, దూరంలో గుఱ్ఱంబండి చప్పుడయింది. తొంగిచూద్దునుగదా బండిలోంచి కూడా ఓగడ్డం నావైపే తొంగిచూస్తోంది. సరీగా సమ్మయానికి ఆగింది. నాగడ్డం ఆనందంతో ఊగిపోయింది, ఆయన బండి దిగిదిగడంతోనే "వచ్చారా" అంటూ ఆనందాతిరేకంతో ఆలింగనం చేసుకున్నాను.

ఆప్యాయంగా గడ్డాలుకూడా కలిసిమెలిసి కొంచెం చిక్కుపడి చాపలా అల్లుకున్నాయి ఒక దానితో ఒకటి!

మావాళ్ళంతా ఆశ్చర్యంతో చూస్తున్నారు.

మా ఆవిడకూడా గబగబావచ్చి ప్రక్కన నిలబడింది.

మళ్ళీ "క్షేమంగా వచ్చారా!" అన్నా హర్ష పులకిత గాత్రుడనై.

"అవచ్చారండీ" అన్నాడాయన వర్షంచిలికినట్లు.

"అయితే బావగారూ!" అన్నాను. ఆయన మొక్కుబడిసంగతి అడుగుదామని.

"ఇంకా నన్ను గుర్తుపట్టలేదుటండీ" అని ఆయన—

"ఆయన మీ బావగారు కాదండీ" అని నా చెవిలో మా ఆవిడ, అనడం ఒకేసారిగా జరిగాయి.

ఆశ్చర్యంతో పరిశీలించి చూద్దును. యింకెవరు? మా గురువుగారు! నాయుడుగారే!

"మీరా!" అన్నాను దిగ్భ్రమ చెంది.

"నే నేనోయ్. కేసు గెల్పును దచ్చి చెడి" అన్నాడాయన ఆనందబాష్పాలు రాలుస్తూ.

నా ప్రాణంమాత్రం అలా మిగిలించే ఎగిరిపోయింది!

"నాపోష్టింగార్డర్లు కూడా ఇచ్చేశారు!" అన్నారాయన సంతోషంగా.

నాపరిస్థితి జ్ఞాపకంవచ్చి ఆయన్ని పీక పిసికేద్దామా అన్నంతకోపము, అసూయ పుట్టుకొచ్చాయి. ఆ ఉద్రేకంలో యేమీ మాట్లాడలేకపోయాను.

"ఇంత క్రొత్తవాడవుగదా! నీ కెలా యిచ్చారోయి నాఖాలీ ఉద్యోగం?"

"తమ చలవల్లనే. నేను మీ అడుగుజాడల్లో నడిచాను. అంతే!"

ఆయన కూడా లేత నవ్వులు పెదవుల్లోంచి వదులుతూ ఓ కాయితం ఇచ్చారు, నన్ను చూడమంటూ. ఆయనకు అధికారపదవి యిచ్చారు. నన్ను మాత్రం ఆ పెద్దమనస్తా పదవిలోంచి తీసెయ్యలేదు. అదే పది వేలనుకున్నారు.

"ఈ గడ్డం, యిదంతా యేమిటి" అన్నాడాయన.

"తిమర్గి యీ చిక్కునుండి తప్పించేందుకుగాను దేవుడికి మొక్కుబడి." అన్నాను.

"సెబాష్ ఇదంతా దేవుడిదయే సంకేతమేమిటి? నేనూ యీ కేసునుండి బయటపడెయ్యమని ఆదేవుడికి మొక్కుకున్నాను."

"అయితే యీ శుభముహూర్తాన్నే మనం యిద్దరం యీ మొక్కుబడులు తీర్చుకుందాం రండి" అన్నాను నవ్వుతూ.

"అలాగే పదవోయి" అన్నాడాయన.

"అయితే గురువుగారూ! కంపెనీ మిమ్మల్ని మరోకోర్టుకు లాక్కెళ్ళి మళ్ళీ మరోలా తీర్పు చెప్తారేమో!" అన్నా సందేహంతో.

"అదంతా ప్లీడర్లకే తెలుసునోయ్. మన తీర్పు కిక తిరుగులేదు తెలుసునా! యిదే దీనికి ఉన్నత న్యాయస్థానం!" అన్నాడాయన ధీమాగా.

# జీవితమాధుర్యం

శ్రీ మల్లాది సత్యనారాయణ

జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు ప్రతి మానవునకు మంచిరోజులు వస్తాయనీ అప్పుడే జాగ్రత్తగా ఆ మంచిరోజుల్ని సద్వినియోగం చేసుకున్నవాడే నేర్పరి అనీ అయితే ఆ మంచిరోజులకోసం నిరీక్షణ ఓర్పు చాలా అవసరం అనీ గోపాలానికి తెలియకపోలేదు. అయితే కాలగర్భంలో కొన్ని సంవత్సరాలు కలిసిపోయి యిప్పుడు చూచినా గొర్రెకు బెత్తెడు తోకే అన్నట్లు ఎదుగూ బొదుగూ లేని తన జీవితాన్ని తలచుకుంటూంటే మంచిరోజులు వస్తాయన్న నమ్మకం కాస్తా నశించింది గోపాలానికి. నశించిపోవడమే కాకుండా ఆ మంచిరోజులు అన్నపదం ఎవరినోటి వెంటవినా వినపడ్డప్పుడల్లా యెవరికి మంచిరోజులు అనే ప్రశ్న వెనువెంటనే వెలువడేది. కాని ఆ ప్రశ్నకు సమాధానం తనలోపలే అణగిపోయేది.

సంవత్సరం పొడుగునా వాన అనక వరద అనక, ఎండనక కొండనక, పురుగనక పుట్ట అనక, రెక్కలు ముక్కలు చేసుకుని పొలం పండించిన వానికి యెంత నిరీక్షించినా మంచిరోజులు రావు. భూమిగల ఖామందుకే యెప్పుడూ మంచిరోజులే వస్తూంటాయి. పగలు పన్నెండుగంటలూ రక్తం ధారపోసి మిల్లులో పనిచేసే కార్మికునకు ఎంత నిరీక్షించినా యెంత ఓర్పు వహించినా మంచిరోజులు రావు. మిల్లు యజమానికి మూడువందల అరవై నాలుగురోజులూ మంచిరోజులే.

కష్టపడేవాడొకడు అనుభవించేది యింకొకడు అనే సిద్ధాంతం వేళ్ళుపాతుకు పోయిన మనదేశంలో అందరికీ మంచిరోజులు యెప్పుడూ రావు. కొందరికే వస్తూంటాయి. అందుచే గోపాలానికి ఆ మంచిరోజులు అన్నమాట వింటే హేళనగా ఉంటుంది.

సాహుకారు వెంకటసుబ్బయ్య యిచ్చిన ఆర్డరు ప్రకారం సరుకు కొనడానికి తెల్లవారుఝామునుండే బయలుదేరి నిమిత్తం సాహుకారిచ్చిన యెనిమిదివందల రూపాయలు జాగ్రత్తగా జాలెం సంచిలో భద్రపరచి నడుం చుట్టూ కట్టుకొని బయలుదేరి యింటికి వస్తున్న గోపాలానికి ప్రొద్దుటినుంచి తిండి లేనందున కళ్ళుతిరుగుతున్నాయి. తన తిండిమాట దేవుడెరుగు. చంటిపిల్లకి ప్రొద్దుటినుంచి పాలులేవు. పాలడబ్బా నిన్ననే అయిపోయింది. ఈ సాయంత్రం పాలడబ్బా కొనుక్కు వెళ్ళకపోతే యీ రాత్రి పిల్లని పట్టుకోగలరా? పాలడబ్బామాట తలపునకు వచ్చేసరికి గుండె గుభేలుమంది. ఏం పెట్టి కొంటాడు పాలడబ్బా. నెలాఖరు అయి ఒకటవ తేదీ వస్తేనే కాని సాహుకారు వెంకటసుబ్బయ్య జీతం యివ్వడు. ఇవ్వడు అంటే సాహుకారు దేమీ తప్పులేదు. ఎందుచేతనంటే గోపాలం సాహుకారు చుట్టూ పని యిప్పించమని తిరిగినప్పుడే సాహుకారు వెంకటసుబ్బయ్య కొన్ని షరతులు జాగ్రత్తగా చదివించి గోపాలంచేత సంతకం చేయించుకున్నాడు. అప్పటికి అంగీకరించి ప్రవేశించాడు గోపాలం.

నెలలో మధ్యగా యెప్పుడూ జీతం తాలూకు డబ్బులో కొంతకూడా అడగడానికి వీలులేదు. నెల పూర్తి అయ్యాక ఒకటవ తేదీని పూర్తిగా జీతం యిచ్చే షరతు మొదటిది.

ఇక రెండవది గుమాస్తా సంఘాలలో చేరడం గాని సమ్మెలలో పాల్గొనడంగాని యెంతమాత్రం కూడదు.

మూడవది. ఇష్టం లేకపోతే పనిమానివేయడం తప్ప జీతం పెంచమని యెప్పుడూ అడగకూడదు.

నాల్గవది. లేబరాఫీసు రూల్సు అంటూ ఆదివారాలు పనిమానడానికి వీలులేదు. ఎంత అత్యవసరమైన పని అయినా సాహుకారు పర్మిషను తీసికొనిదే మానడానికి వీలులేదు.

అయిదవది. పని యేమాత్రం తృప్తికరంగా లేకపోయినా గోపాలాన్ని పనిలోనుంచి తప్పించివెయ్యడానికి నోటీసులతో నిమిత్తం లేకుండా పూర్తిహక్కులు సాహుకారుకున్నాయి.

ఆరవది. నెలజీతం అరవై రూపాయలు అయినప్పటికీ సాహుకారు అంకెలు యెంత యెక్కువగా వేసి సంతకం పెట్టమన్నా గోపాలం సంతకం పెట్టి తీరాలి.

ఇన్ని షరతుల కంగీకరించి ఉద్యోగంలో ప్రవేశించిన గోపాలం యీ రోజు యింట్లో బియ్యం లేక పస్తుపడుకోవలసి వచ్చినా, చంటిపిల్లకు పాలడబ్బా లేకపోయినా సాహుకారుని యేమని అడుగుతాడు? కనీసం చెప్పడంకూడా తన అసమర్థతను సూచిస్తుందని చెప్పలేదు.

ఎన్ని షరతులు బిగించినా ఆ నాటి ఆదుర్దా తగ్గి గుమాస్తాపనికి ప్రవేశించాక యీ నాడు షావుకారు దయతలచలేదని అఘోరించి వాళ్ళదగ్గర వీళ్ళదగ్గర షావుకారు యిట్లా చేస్తున్నాడని చెప్పుకోవడం కూడా పొరబాటేనని గ్రహించిన గోపాలం యెవ్వరితోనూ యేమీ చెప్పకూడదనుకున్నాడు.

ఈ రోజు యెనిమిదివందల రూపాయలు నెలలో ఉన్నాయి. ఒక రూపాయి పెట్టి పాలడబ్బా కొని నాలుగురూపాయల బియ్యంకొని యింటికి పట్టుకువెడితే... ఈ అయిదురూపాయలకి యేం జమా ఖర్చు చెప్పాలి. ఒకటవ తేదీ యింకా పదిరోజులకి గాని రాదాయెను. పోనీ ఒకటవ తేదీ ముప్ఫయి రోజులు గడిస్తేనే గాని రాదుగదా. ఈ ముప్ఫయి రోజులయినా బురదపాము మందంగా నడుస్తాయి. కనిపెట్టుకుకూర్చున్నా ఆ ఒకటవ తేదీ వస్తుందన్న మాటేగాని త్రాచుపాములా జర్రున జారిపోయి ఊరుకుంటుంది. పదిహేను రోజులకోసారి ఒకటవ తేదీ వస్తూంటే బాగుండు ననిపించింది గోపాలానికి. ఏమయినాసరే బియ్యం పాలడబ్బా కొనుక్కు వెళ్ళడానికే నిశ్చయించుకున్నాడు. లేకపోతే యెట్లా? తానేదో ఉద్ధరిస్తాడని జీవితాంతం పోషిస్తాడని నమ్మి మెడలో పుస్తెకట్టించుకున్న భార్యకు బియ్యం తేలేక పోయానని ఏ ముఖంపెట్టుకు చెబుతాడు.

ఇంతకీ పెద్దవాళ్ళకి బుద్ధిలేదు. చిన్నతనంలో నే గుదిబండని మెడకు చేసి వాళ్ళబాధ్యత వాళ్ళు తీర్చుకుంటే సరేననుకున్నారుగాని తరువాత వచ్చే గోపాలం బాధలు కొంచెమేనా గమనించగలరా? అయితే ఒకటి. కాలమానపరిస్థితినిబట్టి ఇప్పుడెంతెచ్చినా చాలడంలేదుగాని గోపాలం చిన్నతనంలో వాళ్ళ నాన్న యెలిమెంటరీ స్కూలు మాస్టరీ చేసేటప్పుడు నెలకు పదుహేడున్నర జీతం యిచ్చేవారు. ఆ డబ్బుతో నలుగురు పిల్లలతో సంసారాన్ని యీదుతూ అప్పుడప్పుడు ఒక్కొక్క కాసు బంగారం (అప్పుడు కాసెంత? పదమూడున్నరేగా) కొని గోపాలం తల్లికి చెల్లెళ్ళకి మురుగులనీ మెళ్ళోకి యేవో అంజనేయ బిళ్ళలనీ చేయిస్తూఉండేవాడు. ఇప్పుడు గోపాలానికి షావుకారు నెలకు అరవైరూపాయలు యిస్తాడు. తాను భార్య యిద్దరు పిల్లలు బ్రతకడం కష్టం అయిపోతోంది. ఇరవయ్యో తారీఖు వచ్చి చెడి యీడ్చుకొస్తున్నాడు. అక్కడినుంచి నెలాఖరు వరకు రోజూ యేకాదశులు, శనివారాలు, కార్తీక పొద్దులు. ఎవరినీ చెయిచాచి అడగలేడు. గోపాలం చిన్నతనంలో "ఈ రోజుల్లో పెళ్ళాన్ని పోషించుకోలేనివాడెవడు?" అనేవారు. అప్పుడు జీవితం అంత తేలికగా ఉండేది. ఇప్పుడెంత బరువైందో గోపాలం లాంటివాళ్ళకే తెలుస్తోందిగాని తక్కినవాళ్ళ కేం తెలుస్తుంది.

తనూ తన భార్య ఏ పస్తులు పడుకునో జీవితాన్ని గడిపేద్దామనుకుంటే వీలులేకుండా ఇద్దరుపిల్లలు కూడాను. గోపాలం దరిద్రానికి సాయం భార్య కాపరానికి వచ్చి యిరవైయేళ్ళయితే యిప్పుడు పుట్టుకొస్తున్నారు పిల్లలు, ఏది తక్కువయినా పిల్లలు పేచీ పెడ్తారు కదా. వాళ్ళకేం కావాలి సంపాదనలోని బాధలు. పెద్దపిల్ల బ్బంద చూచినదల్లా కావాలని యేడుస్తుంది. ఇంక చంటిపిల్ల కథన్నీ తెలియవు. పాలు లేకపోతే యేడుస్తుంది. పస్తు పడుకునే తల్లిదగ్గర పాలెలా ఉంటాయి?...

పిల్లల భవిష్యత్తుకోసం బల్లలుగుద్ది ఉపన్యాసాలిచ్చే అగ్రనాయకులు చేసిందేమిటి? గట్టిగా అడిగితే తిండి పెట్టలేనప్పుడు యెందుకు కనాలి? సంతాన నిరోధానికి అనేక సాధనాలున్నాయిగా? అదరనలో పెట్టకూడదా అంటారేగాని జీవన పరిమాణం హెచ్చినందువల్ల తిండి పెట్టలేకపోతున్నాడనే ఆలోచనే రాదుగా. జీవన పరిమాణం హెచ్చడానికి కారణం ఏమిటీ అంటే స్వతంత్రం వచ్చింది గనుక దేశంలో అన్ని విషయాలు సక్రమపద్ధతిలో సర్దుకునే సరికి కొంతకాలం పడుతుంది. 'మేమూ మా శాయ శక్తులా తంటాలు పడుతున్నాము. పంచవర్ష ప్రణాళికలు అమలుపరుస్తున్నాం. ఒక్కొక్క రాష్ట్రానికి రెండు, మూడు విశ్వవిద్యాలయాలు స్థాపించి విద్యాభివృద్ధి చేస్తున్నాం' అంటారేగాని దిగమింగుడు దేవతలు అంతులేకుండా యెంత మింగేస్తున్నారో, ఎందరు పానకాలరాయుళ్ళు పానకంలాగ తాగేస్తున్నారో, ఎంత దుబారా ఖర్చుల క్రింద కళ్ళవిలా పాల క్రింద ఖర్చవుతోందో, ఎన్ని అనవసరమయిన టూర్ల బిల్లులు పాసవుతున్నాయో? తెలియదు గనుకనా? అందరికీ తెలుసు? అయితే...? క్వశ్చన్ మార్క్. అది సాల్వ్ కాని సమస్య. పైకి చెప్పుకోడానికి వీలులేని సహస్ర వస్త్రప్రణాళిక. తెలిసికూడా తెలియనట్లు నటించవలసిన రాజకీయ రహస్యం. బయటపెడితే మొదటికే మోసం వచ్చే చిదంబర రహస్యం...మనకెందుకు పోనివ్వండి.

అనేక ఆలోచనలు బుర్రలో పరుగెడుతున్నాయి గోపాలానికి. పాప బోసినోటితో నాన్న పాలడబ్బా తెస్తాడని ఎదురుచూస్తూ ఉంటుంది. వట్టిచేతుల్తో తాను వెడితే పాలడబ్బా కూడా కొనలేనివాడవు కన్నెందుకు కనాలి? నందనోద్యానవనం కావలసిన నా జీవితాన్ని మొలకెత్తేసరికే తుంచెయ్యదలుచుకున్నావా?

వాడు జన్మనిచ్చిందెందుకు! నాకా జన్మనిమ్మని నిన్నేం బ్రతిమాలలేదే!' అని అడుగుతుందేమో ?

ఉదయం బయలుదేరి యింట్లోంచి వచ్చేటప్పుడు పెద్ద పిల్ల బృంద "నాన్నగారూ! వాళ్ళ పాప ఎక్కి కూచుంటే ... ఊ... ఊగుతోంది...అలాంటి ఊగే ఉయ్యాల్ని నాకు పట్టుకు రారూ" అంది. కాళ్ళ కడంపడి, గోపాలం అల్లాగే లేమ్మా అన్నాడు అదెంత పని అన్నట్టు. ఆ స్వర్గాన్ని కొనడం గోపాలానికి సాధ్యమా? అప్పుడే కొనవని తెలితే తీసిపోనుగా. ఆశ పెట్టుకు రొదును మానదుగా పిల్ల. పిల్లని ఊరుకో పెట్టడానికి అల్లాగే అనడం తరువాత పిల్లని నిరాశలో ముంచెత్తి నీరసింపచెయ్యడం ఇదీ మనవాళ్ల భవిష్యత్తు.

ఎందుకింత నైరాశ్యం. జేబులో తొమ్మిది వందలున్నాయి. ఏమైనాసరే ఖర్చుపెట్టి కావలసినవన్నీ కొనుక్కు వెడతానని గబగబ నడుస్తున్నాడు.

"ఇతరుల సొమ్ము ఖర్చుపెట్టడానికి మనస్కర వోయి. నిన్ను నమ్మి వ్యాపారం చేసుకు రమ్మని సాహుకారు నీ చేతికి డబ్బు యిస్తే ఖర్చు పెడతావా? ఇదేనా న్యాయం? ఒకటవ తేదీ వచ్చేసరికి అరవై రూపాయలు చేతిలో పోస్తున్నాడే. అల్లాంటి సాహుకారుని అన్యాయం చేస్తావా?" అని అంతరాత్మ ఘోషించింది. ఆ సంచిలోంచి ఒక్క రూపాయికూడా తీయకూడదనుకున్నాడు.

అల్లాగే నీరసంగా కాళ్ళీడ్చుకొంటూ నడుస్తున్నాడు. ఎదురుగా ఫుట్‌పాత్ మీద ఒక పంజరంలో చిలకను పెట్టుకొని ఏవో కొన్ని మడతలతో ఉన్న కాగితాలు ఎదర పెట్టుకొని ఒక ఆసామీ" పక్షిపలుకుతుంది నీభవిష్యత్తు రా తమ్ముడూ" అంటున్నాడు.

గోపాలం యేమీ తోచక ఆపక్షి యేం చెబుతుందోనని యాంత్రికంగా నడిచి అక్కడికి వెళ్ళాడు. ఆ ఆసామీ అణా యిమ్మన్నాడు. జేబులో యెప్పటి నుంచో ఒక చిల్లి కాని ఒక నయాపైస స్నేహం చేస్తున్నాయి. పాత క్రొత్తల కలయికలో దానస్య స్వాగతం క్రొత్తల కలయిక కాలం అన్నట్టున్న ఆ చిల్లి కాని ఆ నయాపైసల స్నేహాన్ని అమాంతంగా విడదీసి చిల్లి కాని యిస్తానన్నాడు. పాపం యెందరి భవిష్యత్తైనా చెబుతాడు గాని తన భవిష్యత్తు తనకే తెలియని ఆ ఆసామీ ఆ చిల్లికానీకి కక్కుర్తిపడి తీసికొని చిలకని పంజరంలోంచి బయటికి తీశాడు.

"అమ్మయ్య! నా చిల్లి కానీ ధర్మమా అంటూ ఈ రెండు నిముషాలేనా స్వతంత్రం యిచ్చాడు పాపం ఆ చిలకకి అని సంతోషించాడు గోపాలం. కాని ఆ వెను వెంటనే ఎగరడానికి వీలులేకుండా చాటుగా రెక్కలు కత్తిరించి బహిరంగంగా స్వతంత్రంయిచ్చానని చూపించే ఆ ఆసామీ మోసం చూస్తే పాపం గోపాలానికి యేవేవో జ్ఞాపకం వచ్చాయి. ఆ జ్ఞాపకం వచ్చినవన్నీ పైకి చూపించడానికి వీలులేని ఆణిముత్యాలు. చూపిస్తే యేదో వంక పెట్టి యేదూరాలు లెక్క పెట్టించే పరమసత్యాలు.

ఆ చిలుక కాగితాల మడతలలోని ఒక మడతను ముక్కుతో లాగింది. ఆ ఆసామీ మడతవిప్పి చదవడం మొదలుపెట్టారు.

"నీవు యిప్పుడు చాలా మంచిరోజులు. నీ ఆలోచనలు వ్యవహారంపై ఫలిస్తే మొగమాపుతాయి. నీ పవిత్రతే నిన్ను కాపాడుతుంది. కంగారుపడి బురదలో అడుగువెయ్యకు. వేగావా జీవితాంతం వదలకు" అని చదివాడు.

ఎక్కడలేని కోపంవచ్చింది గోపాలానికి. ఏమాటంటే కడుపు రగిలిపోతుందో అదే యిక్కడ కూడా ప్రత్యక్షమైంది. ఇప్పుడు చాలా మంచిరోజులట. అందుకే కొంపలో బియ్యంలేవు. అప్పిచ్చే దాతా లేడు. అరువిచ్చే సాహుకారూ లేడు. ఎవరికి మంచిరోజులు ... నాకు కాదు. మంచిరోజులు మా సాహుకారుకు వచ్చాయి. ముందెన్నో రాబోతున్నాయి. నెలరోజులక్రితం లెక్కలుమాయకోగా వ్యాపారంలో పన్నెండు వేలు లాభం వస్తే యీ నాలుగు రూపాయలుపెట్టి చొక్కా కుట్టించుకోమని యివ్వలేక పోయాడు. ఇక నాకు మంచిరోజులేవిటి?...

[illegible] వీడూను. ప్రతీ కాగితం మడతలోను యిల్లాగే రాసివుంటుంది. బహుశః వీటిదగ్గరకి వచ్చినవాడికల్లా మంచిరోజులు వస్తూనే ఉంటాయి. కాని వీడికిమాత్రం మంచిరోజులు రావుకాబోలు. వస్తే వీడికి ఫుట్‌పాత్ మీద నివసించే ఖర్మంయేవిటి? మంచిరోజులమాట యెట్లావున్నా పిల్లయేడిస్తే కనీసం కాసిన్ని బఠానీలేనా కొనిపెట్టకుండా చిల్లికానీకి మాత్రం ఖరాబుపట్టింది. బుర్రగోక్కుంటూ రెండు కాళ్ళకి బుద్ధిచెప్పి గోపాలం ఘటాన్ని యింటికి నడిపిస్తున్నాడు.

అదే ఫుట్‌పాత్ మీద పెద్దచెయ్యి బొమ్మఉన్న అట్టఒకటి పెట్టుకుని ఏవో పెద్ద పెద్ద గ్రంథాలు దగ్గర పెట్టుకుని కూర్చొన్నాడొక పెద్దమనిషి. పెద్దతలపాగ, కోటు, ఆ కోటుకి నాలుగు మెడల్సు. (బంగారానివో గిల్టువో చెప్పలేం అనుకోండి) వేషంమాత్రం హాంగు

"ఛీ! అల్లాంటి గుర్రం యేంబాగుంటుంది. దాని మీదనుంచి పడిపోతే దెబ్బ తగులుతుందమ్మా" అంది.

"ఎందుకు తగులుతుంది."

"ఆ గుర్రం పడగొట్టేస్తుంది."

"ఎందుకు పడగొడుతుంది? మరి వాళ్ళపాపని పడగొట్టదేం"

"దానికి కోపం వచ్చినప్పుడు పడగొడుతుంది."

"ఎప్పుడొస్తుంది కోపం?"

"ఎప్పుడో వచ్చేస్తుంది. ఇంకా కావలిస్తే నాన్న గారిని అడుగు." అంది భర్తని బాధాసముద్రంలోంచి కాస్త మేల్కొల్పాలని.

"ఏమండి నాన్నగారూ! గుర్రానికి కోపం వొచ్చి పడగొడుతుందా?" అంది బృంద, కూర్చున్న తండ్రి ఒళ్లో కెక్కి చొక్కా గుండీలు పట్టుతూ.

"అవునమ్మా" అన్నాడు గోపాలం. సుగుణ మాదిరిగా సర్ది చెప్పేవిధానం తనకు తోచలేదను కున్నాడు.

"అయితే నాన్నగారూ! పెదకల్లం మనకొద్దు" అంది బృంద బుంగమూతి పెట్టి తండ్రితో.

జాలేసింది గోపాలానికి. నీరూ వచ్చింది తన అసమర్థతకు.

పిల్లల కోర్కెలు తీర్చలేనివాళ్లు ఎందుకు కనాలి. కని వాళ్ళ ఆశల్ని పరిహాసంగా నాశనంచేసి వారి పురోభివృద్ధి కెలా అరికడుతున్నారో యీనాడు అర్థమైంది గోపాలానికి. తనకీ పాఠం నేర్పిన బృందను ఒక్క ముద్దు పెట్టుకున్నాడు.

మరి యీముద్దో అని రెండోబుగ్గ చూపించింది బృంద. కోపంతా మటుమాయమయి రెండో ముద్దు కూడా పెట్టుకున్నాడు.

కొంతకాలం జరిగిపోయింది.

"సుగుణా! కాసిన్ని మంచినీళ్ళు అందు కుంటావా?"

"కాసింత మజ్జిగ దాహం తాగరాదూ ఉప్పువేసి యిస్తాను."

"మరి నువ్వుకూడా తాగవు? ఇవ్వాళటికి ఇదింత చెంబో కాస్త ఆ మజ్జిగ తాగి పడుకోవలసిందే. క్రిందటి జన్మలో ఎవరినోటిముందు అన్నం లాగేశాం. ఈ జన్మలో తిండికి మొఖంవాచాము" అన్నాడు కన్నీళ్ళతో గోపాలం.

'అదేమిటండి ఇంతమాత్రానికి...మీరే కంట తడిపెడితే నేనేమిపోవాలి చెప్పండి...మనమాటకేం పాపం పాపకి ప్రొద్దుటినుంచీ పాలులేవు"

"అవును కనకంమాత్రం కన్నాము. గుక్కెడు పాలు పొయ్యలేకపోతున్నాం. మనలాంటి గర్భదరిద్రుల కడుపున యెందుకుపుట్టాలి మరి బృంద నేలా ఊరుకో బెట్టావు."

"నిన్న వండగా గిద్దెడుబియ్యం మిగిలాయి. అవి వండి దానిముందుకు పెట్టాను."

"మంచిపని చేశావు పాపకి పాలులేవు."

"పాపం ఆ యెదిరింటివాని లక్ష్మి గంటక్రితం వచ్చింది. ఏదోమాటల సందర్భంలో పాలడబ్బా అయిపోయింది. తేవాలి అనిచెబితే పాపం వాళ్ళ పాల డబ్బాలో పాలుకలిపి పట్టుకువచ్చి యిచ్చింది. యిప్పుడే"

"మరి పట్టించావా"

"ఏదీ? అదిదా నిద్రొంది. మీరూవచ్చారు. మీకు మజ్జిగయిచ్చి పాపకి పాలు పట్టిస్తాను. అని తొందర గా నే వంటయింట్లోకి వెళ్లిపోయింది.

'సుగుణా' అన్నాడు కన్నీళ్లతో గోపాలం.

'ఏమండీ' అని దగ్గరకు వచ్చింది. చూచింది.

"ఏమిటండీ అది చిన్నపిల్లాడిలా" అని కళ్లనీళ్లు తుడుచు కుంది.

"ఇంత అసమర్థుడైన భర్తను కట్టుకుని యేం సుఖ పడుతున్నావు సుగుణా"

"అబ్బ!......ఏంమాటలండీ అవి.

"పూటకైకూడా గతిలేని కాపరం ఎందుకొచ్చిన కాపరంరా అనుకుంటోందికదూ నీ మనస్సు సుగుణా."

ఆ మాట బాణంలా గుచ్చుకుంది సుగుణ హృదయానికి, తీక్షణంగా చూచింది భర్తవంక "నేను బ్రతికుండగా మీ కేం లేదా!" అంది బాధగా.

"లేదులే సుగుణా. వెళ్ళు మజ్జిగ పట్టుకురా. చెరో గుక్కెడు తాగుదాం."

"ఇంకెప్పుడు అలాంటి మాటలనవని ప్రమాణం చెయ్యండి."

"లేదులే సుగుణా. వెళ్ళు మజ్జిగ తీసుకురా."

కన్నీళ్ళతో నే వంటయింటి గుమ్మంలోనికి వెళ్ళింది. పిల్లి మూతి నాకుకుంటూ యెదురుగా వచ్చింది. సుగుణ చూచింది. గుండె గుభేలుమంది. మూత పడగొట్టి మజ్జిగ కాస్తా పిల్లి తాగేసింది. కళ్ళ నీళ్లు గిర్రున తిరిగాయి. అక్కడే కూలబడింది. ప్రొద్దుటినుంచీ యిద్దరికీ తిండి లేదు. భర్త యింటికి వచ్చాక ఒకవేళ బియ్యం దొరక్కపోతే యిద్దరూ చెరో గుక్కెడు ఆ మజ్జిగ త్రాగి యీ పూట గడప వచ్చుననుకుని, మధ్యలో ఆకలిబాధ అణుచుకోలేక పోయినా, మజ్జిగ త్రాగకుండా అలాగే అట్టే పెట్టింది భర్తకు పట్టుకు వస్తానని చెప్పి లోపలికి వచ్చింది. ఏ ముఖం పెట్టుకు భర్త దగ్గరకు వెళుతుంది? ఏమని చెబుతుంది?

పాప పాలులేక తొట్టెలో ఏడుస్తోంది. ఎంత సేపటికీ మజ్జిగ తీసుకు రాకపోవడంచేత గోపాలం 'సుగుణా!' అన్నాడు. జవాబు రాలేదు. ఉదయం నుంచీ భోజనం లేకపోవడంచేత కళ్లు తిరిగి పడిపోయి ఉంటుందేమోనని కంగారుపడి వంటయింట్లోకి వచ్చాడు. సుగుణ ముఖం రెండు చేతులలో మూసుకుని ఏడుస్తోంది.

'ఏమిటి సుగుణా' అన్నాడు భయంగా.

'పిల్లి మజ్జిగ కాస్తా తాగేసింది' అంది యేడుస్తూ సుగుణ.

ఇంతమాత్రానికే యేడుస్తారా? పోనీలే పాప యేడుస్తోంది ఆపాలు కాసిన్ని పొయ్యరాదూ?" అన్నాడు.

లేచింది సుగుణ. పాలగ్లాసు తీసుకుంది. పట్టుకు వచ్చింది. పాపని లేవదీసి పాలుపొయ్యడం కోసం కాళ్లమీద పడుకోబెట్టుకుంటోంది. పాప చేతులు కాళ్లు కొట్టుకుని యేడవడంలో చెయ్యి తగిలి ఆ పాల గ్లాసు పడిపోయింది.

అయ్యోయ్యని అరిచింది సుగుణ. తల గోడకేసి కొట్టుకు యేడుస్తోంది పిల్లకి ఆ పాలుకూడా పట్టలేక పోయా నేనని.

గోపాలానికి నవ్వు ఏడుపు రెండూ కలిసి వచ్చాయి. కళ్ళవెంట కన్నీరు కారుస్తూ నవ్వుతున్నాడు.

ఏడుస్తూనే యెందుకు నవ్వుతున్నారంది సుగుణ.

"ఎందుకా? జీవిత మాధుర్యం అంటే మేమిటో యీనాడు తెలుసుకున్నాను నాకు జీవితపు లోతుల్లో ఉండే అందం కనిపిస్తోంది సుగుణా! ఎంత విచిత్రమైన సంఘటన. మనజీవితాంతంవరకు మరచిపోగలమా? కష్టాలున్నప్పుడే సుఖాలయొక్క నిజమైన విలువ తెలుస్తుంది సుగుణా. జీవితపు లోతుల్ని తరచి చూచిన వాడే నిజమైన జీవిత మాధుర్యాన్ని పొందగలుగు తాడు. సుగుణా! నిజమైన జీవిత మాధుర్యం అనే పదానికి సరియైన అర్థం ఈ మన విచిత్రసంఘటనే సుగుణా!" అన్నాడు.

సుగుణను యేం అనాలో తెలియక గుడ్లు వప్పగించి చూస్తోంది గోపాలంవంక.

కాళ్లమీదవున్న బోసినోటి పాప చైతన్య రహితయైవున్న సుగుణ కాళ్ల మీదనుంచి దొర్లిపోయి ఒలికిన పాలల్లో పడి రెండుచేతులతో తపతప కొడుతోంది. అవ్యక్తమైన ఆనందంలో బోసినోటితో కలకల నవ్వుతూ తల్లివంక చూస్తోంది.

ఆ చూపులతో తేరుకున్న సుగుణ ఒక్కసారి పాపను తీసికొని గుండెలకు హత్తుకుని చిరునవ్వు నవ్వింది.

# గ్రంథవిమర్శనము

## దేవీగానసుధ

[ద్వితీయ సంపుటి]

శ్రీ ఓగిరాల వీరరాఘవశర్మ. గోష్పదీక్షేత్రం. కొవ్వూరు. పశ్చిమ గోదావరిజిల్లా. వెల: మూడు రూపాయలు.

ఓగిరాల వీరరాఘవశర్మగారు 1947 లో దేవీగానసుధ ప్రథమభాగం ప్రకటించారు. దానికి ఇది రెండవ భాగం. దీనిలో ఉన్నవి మొత్తం 86 కృతులు. వీటిలో కొన్ని సంస్కృతంలో రచించిన కృతులు. కృతులన్నిటిలోను చరమలక్ష్యమైన పరమారాధ్య దేవత గాయత్రీదేవి.

కేవలం గేయకవులుగాని, కేవలం సంగీతవేత్తలు గాని కృతులు రచించి కృతకృత్యులనిపించుకోలేరు. ఈ విషమయిన రచనకు, అటు సంగీతంలోను, ఇటు సాహిత్యంలోను సముచితమయిన శక్తిసామర్థ్యా లవసరం.

కనుకనే నేడాంధ్ర దేశంలో స్వతంత్రంగా కృతులు రచించగలిగిన వాగ్గేయకారుల సంఖ్య చాలా తక్కువ. సంగీత విద్వాంసులలో చాలా మంది త్యాగరాజాదుల కృతులకు గానకల్పనలోనే తమ కళాసామర్థ్యం వ్యక్తీకరిస్తూ అంతటితోనే సంతృప్తి పొందుతున్నారు.

ఈ రచయిత స్వతంత్రంగా కూడా వాగ్గేయ రచన కుపక్రమించారు. శ్రీ వీరరాఘవ శర్మగారి కృతులలో సహజము, శుచిఅయిన భక్తిభావం జాలువారుతున్నది. ఈ కృతులు క్రమక్రమంగా ప్రజాదరణ, విద్వాంసుల ఆదరణ పొందడానికి కృతులలో జాలువారే గానమాధుర్యమేగాక, భక్తిభావం కూడా కొంతవరకు కారణమే.

ఈ గ్రంథంలో రచయిత కేవలం కృతులే గాక, ప్రతికృతికీ, స్వరవివరణతో పాటు ఆయారాగాల లక్షణాదులు కూడా, సంగ్రహంగా పొందుపరిచారు. ఇవి సంగీత విద్యార్థులకే గాక, విద్వాంసులకు కూడా ఉపకరిస్తాయి. ఆదితాళంలో సారంగ రాగంలో రచించిన ఈ క్రింది కృతినిబట్టి వీరి రచనా పటిమ గుర్తించవచ్చును. "అమ్మ! ప్రోవ నీ కన్న వేరెవ్వరున్నారు ఆపన్నరక్షణ ఇలలో! కన్నతల్లి! ఆదిలక్ష్మి! కామేశ్వరి! తిన్నగా భావాబ్ధి దాటించి నన్ను తో కుప్పవిడిచి పాతకుల చెంతజేరి పొట్టకూటికై బొంకులాడగలనా! ఇట్లనిన విమ్మక రాఘవుని రక్షించిన్ను దీనరక్షణి గాదా"

శ్రీ శర్మగారు అత్యల్ప సంఖ్యాకులయిన నేటి ఆంధ్ర వాగ్గేయకారులలో పరిగణింప దగినవారు.

అన్ని విధాలా సాంప్రదాయికమయిన త్యాగరాజాదుల అడుగు జాడల్లో నడిచిపోతూ వీరు ఆంధ్రగాన సరస్వతికి కొన్ని నూతనాలంకృతు లర్పించారు.

'శాస్త్రి'.

## భారత యువజనులారా!

అనువాదకులు: కే. శే. తత్త్వానందస్వామి. ప్రతులకు: శ్రీ రామకృష్ణమఠము మైలాపూరు మద్రాసు-4. వెల: రెండురూపాయలు.

శ్రీ వివేకానందస్వామి భారతదేశం నాలుగు చెరగులా పర్యటిస్తూ చేసిన ఆధ్యాత్మిక ప్రబోధ ప్రసంగాలు ఆ నాటికి నిద్రితమయి ఉన్న భారతజాతికి వినూత్న చైతన్యం కలిగించాయి. భారతజాతి స్వాతంత్ర్యకాంక్షకు, నవజాగృతికి శ్రీ వివేకానందుని ప్రసంగాలు మేల్కొలుపు లయినాయని అనడం అతిశయోక్తి కాజాలదు.

కే. శే. తత్త్వానందస్వామి ఆ ప్రసంగాలలోని 9 ప్రసంగాలు 'భారత యువజనులారా!' అన్న గ్రంథనామధేయంతో ఆంధ్రంలోనికి అనువదించారు.

'హైందవ జీవితము వేదాంతము' 'హిందూ మతమునందలి సామాన్య సూత్రములు' మొదలైన ఈ తొమ్మిది శీర్షికల్లోను వివేకానంద సందేశం చాలా వరకు సంగ్రహంగా గంభీరంగా ప్రతిఫలిస్తున్నది.

అనువాదకులు చేసిన ఆంధ్రానువాదం శుచి అయిన గ్రాంథిక శైలిలో సాగిపోతూ ఒక్కొక్క చోట అనర్గళమయిన వివేకానంద వాగ్ధోరణి స్ఫురింప జేస్తున్నది.

హైందవ సంస్కృతి అంతరార్థం అవగాహన చేసుకోవాలంటే వివేకానందుని రచనలు పరిశీలించడం ఆవశ్యకం. అందులోను ఈ గ్రంథం వివేకానంద సందేశానికి సారభూతమయినది. 'శాస్త్రి'

## శివ తాండవము

అనువాదము : బులుసు సూర్యప్రకాశశాస్త్రి. సాధన గ్రంథమండలి, తెనాలి. వెల: ఒక రూపాయి.

శివతాండవాన్ని గురించి, కావ్యాలు, శిల్పాలు, చిత్తరువులు అనేకంగా బయలుదేరాయి. బయలుదేరుతున్నాయి. ప్రాచీనకాలంలో కూడా శివతాండవం వర్ణించే కొన్ని శిల్పా లావిర్భవించాయి.

శివతాండవానికీ, ఆర్ద్రోత్సవానికీ సంబంధించిన ఇతిహాసాలు, సంప్రదాయాలు చాలావరకు, శివపురాణంలో విద్యేశ్వర సంహితలోను, స్కాందపురాణంలో సూతసంహితలో ముక్తిఖండంలోను ఉన్నాయి.

శ్రీ సూర్యప్రకాశ శాస్త్రిగారు ఈ రెండు పురాణాలలోను శివతాండవానికీ ఆర్ద్రోత్సవానికీ సంబంధించిన మూల సంస్కృత భాగాలతో బాటు తేటతెనుగు వివరణలు కూడా చేసి ఈ గ్రంథంలో చేర్చారు. శివతాండవ రహస్యము సంప్రదాయాలు తెలిసికోదలచినవారి కీ చిన్నగ్రంథం అవశ్యపఠనీయం.

'శాస్త్రి'

## అంతర్దర్శనము

శ్రీ ఉప్పాడ రామారావు. ప్రకాశకుడు: హనుమంతు మోహనరావు. తిలగాము. వయా సోంపేట. శ్రీకాకుళం జిల్లా. మూల్యము 2-50 నయాపైసలు.

'అంతర్దర్శనము' అనగానే ఇది ఏదైనా ఆధ్యాత్మిక గ్రంథమనే ఊహ కలగవచ్చును. కాని ఇది అలాంటిదేమీ కాదు. ఇది ఖండకావ్యాల సంపుటి. దీనిలో స్తుతి, క్రీడ, స్వర్గ శృంఖలములు మొదలయిన 27 ఖండకావ్యాలున్నాయి. గేయాలు మొదలయిన వేవీ లేవు. అన్నీ పద్యాలే. ఐతే ఈ ఖండకావ్య సంపుటి అంతా ఒక పరిమిత పంథాలో నడిచిపోతుంది.

ఈ సంపుటిలో క్రీడ, ఆంగ్లదేశము మొదలైన రెండు మూడు ఖండకావ్యాలలో తప్ప మిగిలిన అన్నిటిలోను ఏకోన్ముఖంగా మోహశృంగారాదుల వర్ణ ఒక్కటే పరమలక్ష్యంగా కనిపిస్తుంది.

'ప్రశాంతి' అనే శీర్షికలో ఒక యువతి సంతానార్థం అనేకమైన పాట్లుబడి ధూర్తవైద్యులు మొదలయిన వారి దుశ్చర్యలకు లోనై తనశీలం కోలుపోతుంది.

ఇలాగే 'ఆత్మగతి' అనే ఖండకృతిలో ఒక కవి కవయిత్రిని మోహ వ్యాపారానికి ప్రబోధిస్తాడు.

ఇలాగే ఈ కావ్యంలో చాలా ఖండకావ్యాలలో మోహ శృంగార సన్నివేశాలు వర్ణించడమే కవి లక్ష్యంగా కనబడుతున్నది. కొన్ని కొన్ని చోట్ల అసభ్యవర్ణనలు కూడా అతివేలంగా వెల్లువోయాయి. కేవలం ఇలాంటి అనుచిత సన్నివేశ వర్ణనమే ఈ కవి అసలు లక్ష్యమేమో!

అయితే ఈ కవి పద్యరచనలో శక్తిసంపన్నులు. తగినంత వ్యుత్పత్తి, సామర్థ్యము కలవారు. పద్యాలు నిరర్గళ ధారతో సాగిపోతాయి. ఖండకావ్య సంపుటమైనా ఈ గ్రంథం అంతా ఒక నవల చదివినట్లుగా చదువుకు పోవచ్చును.

చక్కని రచనాశక్తి కలిగిన ఈ కవిగారు వస్తువర్ణనలోను, మితిమీరిన కావ్యలక్ష్యం లోను ఔచిత్య దృష్టి లేకపోవడం శోచనీయం. అవతారిక లోని ఈ క్రిందిపద్యం వీరి రచనాశక్తికి చక్కని తార్కాణం:

"సన్నుత మూర్తికిన్ వరద
శాంతునకున్ రసభావభావనా
భ్యున్నత సత్కళానిధికి
బుణ్యున కాంధ్ర సుపర్వవాణి భా
స్వన్నుత వేదికిన్ గుణమహోదధికిన్
ఘన భోగ భాగ్య సం
పన్నునకున్ వదాన్యజన
మౌళికి నాశ్రిత పక్షపాతికిన్"

—శాస్త్రి.

Printed & Published For Nageswara Rao sEtates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.